# అక్షతలు

## కవితా సంకలనం

అయ్యదేవర పురుషోత్తమ రావు



యువభారతి ప్రచురణ




భువన విజయం ప్రదర్శన సందర్భంగా

# అక్షతలు

(కవితా సంకలనం)




అయ్యదేవర పురుషోత్తమ రావు

**AKSHATALU**
An Authology of Poetry
By **AYYADEVARA PURUSHOTHAMA RAO**



యువభారతి

ప్రచురణ : 169

ప్రథమ ముద్రణ : కృష్ణాష్టమి, 4-9-2007

ప్రతులు : 500

ముఖచిత్రం : జీడిగుంట వేంకటరావు

డి.టి.పి. :

బి. కిరణ్ శర్మ

శ్రీ సాయిరాం స్టేషనరీ & డి.టి.పి

సెల్ : 9247474879, 9866729518

ముద్రణ :

కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్

40 ఎపిహెచ్‌బి, విద్యానగర్, హైదరాబాద్ - 44

ఫోన్ : 27618261

ప్రతులకు :

యువభారతి

C/o ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు

తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001

వెల రూ. 20/-



# అభినందన

పద్యనాటక రంగంలో వివిధ పాత్రల్లో ప్రత్యేకించి కృష్ణపాత్రలో అగ్రేసరస్థానం వహించిన నటోత్తముడు అయ్యదేవర పురుషోత్తముడు.

ఈ కవితా సంపుటి ద్వారా అయ్యదేవరవారు సాహితీరంగంలో కవి భూమికలో అవతరిస్తున్నాడు. ఈ సంపుటిలోని మొదటి కవితలో తాను ఇద్దరమ్మలనే కొమ్మల ఉయలలో హాయిగా ఉగిన అదృష్టజీవినని ఎంతో ఆర్ద్రమనస్కతతో నివేదించుకున్నారు వారు.

అనుభవం అనే కవితలో "అనుభవం ఏమంటున్నది" అనే ప్రశ్న వేసుకుని "ఆశ జీవితానికి సోపానం అంటున్నది" అంటూ మనిషి మనుగడకు మూల సూత్రాన్ని నిర్దేశించారు.

ఇందులో అనేక కవితలు వచన కవితా ప్రక్రియలో వున్నా కొన్ని మాత్రాచ్ఛందస్సులో రూపొందించినవీ ఉన్నాయి. "నడిపించు ధర్మచక్రం" అంటూ ఆరంభించిన గేయంలో సమమాత్రలతో, పంక్తుల ఏకరూపతతో సాగిన లయాత్మకగతి హృదయరంజకంగా ఉంది.

నాపైన పురుషోత్తమ రావు గారు రాసిన రెండు కవితల్లో.

"తల్లి సరస్వతికి తప్ప తలవంచని ధీరుడు" అంటూ పలికిన ఆ వాక్యం నన్ను ముగ్ధుణ్ని చేసింది.

భావ నిర్దిష్టత, అభివ్యక్తి స్పష్టత వున్న తమ కవితలను "అక్షతలు"గా మనకందిస్తున్న పురుషోత్తమ రావు గారికి నా హార్దికాభినందన.

# "కవితా శారదా సమర్చన"

డా॥ తిరుమల శ్రీనివాసా చార్య

"కమ్మని స్నేహం బంగరునాణెం
బొమ్మా బొరుసూ రెండు సమానం"

శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారు నాకు ఆత్మీయ మిత్రులు. మారెండు గుండెల మధ్య సౌహార్దవారధి నిర్మించింది 'యువభారతి' సంస్థ. యువభారతి సహృదయ హృదయాలలో సాహిత్యసుధను నింపడమేకాక సభ్యుల మనస్సులను స్నేహ సౌరభతరంగితం చేసింది. సభ్యుల నెందరినో రచయితలుగా కవులుగా పండితులుగా తీర్చిదిద్దింది. అలా నాకు పరిచితులైన కళామూర్తులలో శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగా రొకరు. వారు, యువభారతి'కి ఉపాధ్యక్షులుగా భాషాసేవ చేశారు. ఇప్పుడు ఆ 'భారతి' దయా విశేషం చేత కవిగా వారు ముందుకు వచ్చారు.

శ్రీ పురుషోత్తమరావు గారు మంచి నటులు, మధుర గాయకులు, గానసంగీత రంగకృతస్వాంతులు. ముఖ్యంగా పద్యనాటకాలలో ప్రధానమైన పాత్రలను ధరించి, అభినయ మనోజ్ఞంగా నటించి, ముగ్ధమోహన రాగాలంకృత గళంతో పద్యాలు పాడి, 'నటసారథి' బిరుదాంచితులయ్యారు వారు. శ్రీ కృష్ణపాత్ర ధారిగా వారు ప్రదర్శించిన ప్రతిభ సహృదయ హృదయైకవేద్యం. అందుకే వారు 'అభినవ కృష్ణ'గా, 'మోహనవంశి' గా సభాసన్మానాలందుకున్నారు. ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు రూపకల్పన చేసిన ఆంధ్రభారతావతరణం, కవిబ్రహ్మ తిక్కన, కనకాభిషేకం, భువన విజయం మొదలైన సాహిత్యరూపకాలలో రాజ పాత్రలను ధరించి ప్రేక్షకులను రంజింపజేశారు. వృత్తిరీత్యా వారిది ఆర్థికదృష్టి, ప్రవృత్తిరీత్యా శబ్దదృష్టి, పురుషోత్తమరావు గారు నవలాకారులుగా, సభ్యసమాజానికి చిరపరిచితులు. వారు కవిగా 'అక్షతలు' అనే ఈ కవితా సంపుటిని ప్రచురించడం ఇదే ప్రథమం. ఈ సంపుటిని యువభారతి పూర్వవ అధ్యక్షులూ త్యాగమూర్తి

సౌజన్య సింధువూ కీ॥శే॥డా. ఇరివెంటి కృష్ణమూర్తికి అంకితం చేసి ధన్యులయ్యారు అయ్యదేవర వారు.

ఈ 'అక్షతలు' కవితా సంపుటిలో ఇరవైఐదు కవితాఖండికలున్నాయి. ఒకటో రెండో గేయాలు తప్ప మిగిలిన వన్నీ వచన కవితాకృతులే. ఇవన్నీ గతంలో ఉషస్సు, స్వరాలు వంటి యువభారతి కవితా సంపుటాలలోనూ, ప్రియజనని, తుపాకిరవ్వలు, కాంగ్రెస్ – వంటి పత్రికా సంచికలలోనూ ప్రచురితమైనవే. శ్రీ పురుషోత్తమరావు గారిలో ఒక మంచికవి దాగి ఉన్నాడని ఈ సంపుటి నిరూపిస్తున్నది.

పురుషోత్తమరావు ఇద్దరమ్మల ముద్దుకొడుకు. నవమాసాలుమోసి కన్నవారు ఒకరు. లాలించి పాలించింది మరొకరు. రెండుకొమ్మల ఊయల అనే ప్రథమ ఖండిక ఈ అంశాన్ని అందించింది. కనిపెంచిన ఉభయమాతృమూర్తులను 'రెండుకొమ్మల' అనే మాటల్లో కవితా మధురంగా వర్ణించి వ్యక్తం చేశారు కవి. 'కొమ్మ' అనే పదంలో శ్లేష అందంగా ఒదిగిపోయింది. ఇద్దరుతల్లుల చల్లని వాత్సల్య సుధాగీసేచనంలో పులకించిన పుణ్యశాలి అయ్యదేవరవారు.

అయ్యదేవర వారి అచ్చమైన దేశభక్తిని రవ్వలు, నవభారతం అనే కవితలు చక్కగా చాటుతున్నాయి. 'వయసు' అనే కవిత రసాత్మకమైన సన్నివేశానికి సంక్షిప్త శబ్దచిత్రణం.

"గతం ఒరిగించింది లేదు కాబట్టి
వర్తమానం వక్రగతులకే నిలయం కాబట్టి
భవిష్యత్తులు ఎండమావులే అంటున్నది"

అనే పంక్తులు ఈ కవి పండించుకున్న అనుభవానికి నిండైన అక్షరాకృతులు. 'మంచి కార్యమే మహాయజ్ఞం' – అనే సూక్తి కూడా వీరి అనుభవమేఘం కురిసిన బిందువే. భవాన్ని – అంటే పుట్టుకను – అనుసరించి వచ్చేదే అనుభవం కదా !

'నువ్వెంత' అనే ఖండిక ఈ కవి లో కజ్ఞతకు ఒక సూచిక.

"తీర్చిన సోపానం కాదు
జీవితం
నిరాఘాటంగా ఆరోహించడానికి
"వలచివచ్చిన వధువు కాదు
జీవితం
అనువుగా అనుభవించడానికి" – వంటి చరణాలు
సరసశచ్ఛార్థసిద్ధికీ నవ్యతకూ ఉదాహరణాలు.
"సాగించు క్రాంతిరథం
లయించు ద్వేషపథం
సాధించు ప్రేమతత్వం
రూపించు స్నేహభావం" – అని ప్రబోధిస్తున్నారు లోకాన్ని
పరిణతాత్ములైన శ్రీ పురుషోత్తమరావు గారు.
"స్వర్ణయుగం ఎక్కడోలేదు మన చేతిలో ఉంది"
అనే ఈ కవి 'భావన' ఆశావాదాన్ని గర్భీకరించుకున్నది.

మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇద్దరు జ్ఞాన పీఠ పురస్కారగ్రహీతలున్నారు. మొదటివారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు, రెండవ వారు పద్మభూషణ్, మహాకవి ఆచార్య సి.నారాయణ రెడ్డి గారు. మొదటివారిని గూర్చి ఒక కవిత, రెండవ వారిని గూర్చి రెండు కవితలు వ్రాశారు శ్రీ పురుషోత్తమరావుగారు.

విశ్వనాధ వారిని
"మహత్తర సాహితీ విహాయసంలో
మహోజ్జ్వలంగా
భాసిస్తున్న మధ్యందిన మార్తాండుడు" గాను "రసరాట్టు" గాను,
'ఉత్తుంగహిమగిరి శృంగం' గానూ, ఆచార్య నారాయణ రెడ్డి గారిని –

'స్థితప్రజ్ఞుడు' గాను,
"సాహిత్యోద్యాన వనంలో
ఒక క్రొత్త కోకిలారావం" గాను
"కవితా శాభికల గానం చేసే
కమనీయ కవితా వసంతుడు" గాను

"శరత్పూర్ణిమాచంద్ర సదృశుడు" గానూ, హృద్యంగా అభివర్ణించి, ఉభయులనూ ఉదాత్తంగా ప్రస్తుతించారు శ్రీపురుషోత్తమరావు గారు.

ఈ 'అక్షతలు' కవితా భారతీ సమర్చనంలో కవి సమర్పించిన అక్షరాక్షతలు, బాసల తల్లిపై ఈ కవి చల్లిన సేసలు.

కవిగా అడుగు ముందుకు వేసిన మిత్రులు శ్రీ పురుషోత్తమరావు గారి కావ్యాన్ని గూర్చి, వారి కోరిక మేరకు, ఈ నాలుగు నుడుగులు వ్రాయడం జరిగింది. కవిమిత్రులు శ్రీ అయ్యదేవరవారిని, ఈ కవితా సంపుటిని ప్రచురించినందుకు హార్దికంగా అభినందిస్తున్నాను.

# ఆత్మీయం

డా॥ పింగళి జగన్నాథ రావు
ఎం.ఏ, పి.హెచ్.డి.

అయ్యదేవర పురుషోత్తమరావు గారు ఏదిచేసినా అది చాలా ఆత్మీయంగా సహజంగా ఉంటుంది. ఎక్కడా కృత్రిమంగాని కృతకంగాని కనిపించవు. కవితవ్రాసినా నాటక పాత్రలో డైలాగులు చెబుతున్నా. బజారులో కనపడి ఏంబాబూ అని పలకరించినా ఆయన మాటల్లో ఏదో ఆప్యాయతా, స్వచ్ఛతా, తాదాత్మ్యతా మనం చూస్తాము.

సాహిత్యమన్నా సంగీతమన్నా ఆయనకు ప్రాణం. అన్నిటినిమించి నటన మీద ఆయనకున్న అభిమానం అవధుల్లేనిది. నాటకాలు, ముఖ్యంగా పద్యనాటకాలల్లో ఆయనకున్న అభినివేశం, సాటిలేనిదేగాక సాటివాళ్ళకు ఆదర్శప్రాయమైనది. ఇవన్ని ఒక ఎత్తైతే ఆయనమాట, ఆమాటల వెనక ఉన్నమనస్సు, అందులోని ఆప్యాయత, ఆత్మీయులమీద ఆయన ప్రదర్శించే గౌరవం చెప్పుకోదగ్గవి. నాటక రంగంలో కాకలు తీరిన ఆయన తనకంటే చిన్నతరం నటులతో వ్యవహిరించే తీరు చూస్తుంటే "వర్తమాన కవులను సంభావించి, భావికవులను బహూకరించి" అన్న పోతనామాత్యుడు జ్ఞాపకం వస్తాడు. ఆ సమయంలో ఆయన ముఖంలో చిందులాడే సౌజన్యం, చిరునవ్వు నిజంగా ఇతరులు నేర్చుకొనే విధంగా ఉంటాయి. పెద్దమనిషంటే ఆయన అనిపిస్తుంది.

అసలు విషయానికి వస్తే ఆయన అప్పుడప్పుడూ రేడియోలో, వివిధ పత్రికలలో, సంకలనాలలో, వ్రాసి, చదివిన కవతలన్నీ ఒక పుస్తకంగా వస్తే బాగుంటుందన్న ఆలోచనతో ప్రచురించిన పుస్తకం ఈ "అక్షతలు" కవితా సంకలనం.

వృత్తిరీత్యా ఆయన బ్యాంకు ఆఫీసరు. అంటే ఖాతాలు అప్పులు, వడ్డీలు, లావాదేవీలు ఇలా నిక్కచ్చిగా డబ్బుతో వ్యవహారం సాగించే వృత్తిగల ఆయన

లలితభావుకమైన కవిత్వం వ్రాయడం, నటన మీద మక్కువ పెంచుకోవడం నిజంగా చిత్రమైన విషయం. ఇందులోని కవితలను చూస్తుంటే "కవి స్వయంభువు" అన్నపెద్దల మాట అక్షరాల సత్యమనిపిస్తుంది.

ఈ గ్రంథంలో ఏకవితను చూసినా పట్టిపట్టి వ్రాసినట్లుగాక హృదయపు పట్టులో నుంచి అలోచనలు అలవోకగా జాలువారినట్లుంటుంది. ముఖ్యంగా "లోకం", "అనుభవం". అన్న కవితలలో ఆయన పలికిన మాటలు జీవితసారాన్ని కాచివడబోసి కమ్మగా అందించి నట్టుంటాయి. అలాగే "రవ్వలు" అన్నకవితలో మాతృదేశ రక్షకుడైన సైనికుడి తుపాకీ శత్రువులపై వర్షిస్తున్న అగ్నివర్షాన్ని వర్ణించిన తీరు అమోఘం. అలాగే మొదటి కవిత "రెండు కొమ్మల ఊయల" మాతృత్వపు మమకారాన్ని గుర్తుకు తెచ్చే మహనీయమైన రచన.

సహృదయ భావుకుడైన ఆయన హృదయ స్పందనలు కవితా సంకలనంగా, రూపుదిద్దుకునే కార్యక్రమంలో నా సహాయాన్ని అయ్యదేవర వారు అభిలషించడం అదృష్టంగా భావిస్తూ. రచనలను ఒక క్రమంలో కూర్చి తగిన తీరున తీర్చే అవకాశాన్నినాకిచ్చిన పురుషోత్తమ రావు గారికి నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

ఇంతమంచి పుస్తకాన్ని సహృదయులూ, సాహితీ ప్రియంభావుకులూ అయన యువభారతి వ్యవస్థాపక అధ్యక్షులు డా॥ఇరివెంటి కృష్ణమూర్తి గారికి అంకితం ఇవ్వటం మరొక మంచిపని. ఇలాంటి పనులు మనిషి మనస్సులో మెదిలే కృతజ్ఞతకు నిదర్శనంగా భాసిస్తాయి.

పురుషోత్తమ రావుగారు ఈ సాహిత్య వ్యవసాయాన్ని నిరంతరాయంగా కొన సాగిస్తూ మరిన్ని మంచి పుస్తకాలతో తెలుగు కవితా సరస్వతిని అలంకరిస్తారని ఆశిస్తూ వారికి ఆప్రేరణను పరమేశ్వరుడు కలిగించాలని ఆకాంక్షిస్తూజ

**డా॥పింగళి జగన్నాథరావు**

అలకాపురి
హైదరాబాదు - 35.

దీ. 12-8-2007

# మామాట

మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజుల వాగ్విలాసాం
మాహేంద్రనీలద్యుతి కోమలాంగీం
మాతంగ కన్యాంమనసా స్మరామి

సభా సరస్వతికి నమస్కారములు. సమయం.... గంటలు. ఆనాటి కార్యక్రమాన్ని ప్రస్తావించి, సభాధ్యక్షీయ వక్తలను వేదిక పైకి ఆహ్వానించిన తరువాత యువభారతి సభలలో వినిపించే ప్రార్థనా శ్లోకమిది. యువభారతి వేదికపై తరచు తన మదురగాత్రంతో ఈ శ్లోకాన్ని ఆలాపించిన వారు శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారు.

యువభారతి సమాజంలో చైతన్యాన్ని తీసుకురావడానికి సాహిత్యాన్ని ప్రధాన సాధనంగా ఎంచుకుని ముందుకు సాగుతున్న సంస్థ సాహితీ సాంస్కృతిక సంస్థ. వ్యక్తులలో అంతర్లీనంగా ఉన్న సృజనాత్మక శక్తులను వెలికి తీయడానికి ప్రయత్నిస్తున్న సంస్థ. సమ్యగవగాహనతో సదాలోచనలు ప్రసరింపజేయడానికి, వాణిని వినిపించే నేర్పును, కలాన్ని నడిపించే నైపుణ్యాన్ని యువకులకు కలుగజేయడానికి కృషి చేస్తున్న సంస్థ. యువభారతి కార్యక్రమాలను ప్రధానంగా రూపకల్పన చేసినవారు మా పూర్వాధ్యక్షులు ఆచార్య ఇరివెంటి కృష్ణమూర్తిగారు. ఇప్పుడు మా సమావేశకర్త ఆచర్య వంగపల్లి విశ్వనాథం గారు వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను ప్రతినెలా మొదటి ఆదివారం మధ్యాహ్నం రెండు గంటలకు చిక్కడపల్లి నగర కేంద్ర గ్రంథాలయంలో యువకుల కోసం ఉచితంగా నిర్వహిస్తున్నారు.

యువభారతి స్ఫూర్తితో నవలా రచయితగా, కవిగా, వక్తగా పేరు గడించిన మా కార్యవర్గ సభ్యులు పురుషోత్తమరావు గారు నిసర్గ నటులు. ఏభైయేళ్ల నటజీవితం, నలభై యేళ్ల యువభారతి సాన్నిహిత్యం కలిగిన డెభై నాలుగేళ్ల నవయుకుడు శ్రీ పురుషోత్తమరావుగారు. వృత్తిపరంగా ఆర్థిక రంగంలో అధికారిగా పనిచేసినా, ప్రవృత్తిపరంగా పురుషోత్తముని పాత్రలతోబాటు ఉత్తమపురుషులైన

హరిశ్చంద్ర, శ్రీకృష్ణదేవరాయ, రామదాసు, తుకారాం, బిల్వమంగళాది పాత్రలను సమర్థవంతంగా తనపై రూపొందించుకున్న వ్యక్తి. ఆచార్య దివాకర్ల వేంకటావధాని డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి వంటి పండితోత్తముల సరసన సాహితీ రూపకాలలో పాలు పంచుకున్న వ్యక్తి. అనేక సన్మానాలు అందుకున్న వ్యక్తి. అభినవకృష్ణ, నటసారథి, మోహనవంశి మొదలగు బిరుదులచే అలంకరింపబడిన వ్యక్తి. తెలుగు విశ్వవిద్యాలయం వారి సన్మానం, అమెరికా తానా (TANA) సభలచే సన్మానం వానిలో పేర్కొనదగినవి.

సహృదయత, ఆప్యాయత, నిరాడంబరత, సరసత ఆకళించుకున్న ఉత్తమ పురుషులు పురుషోత్తమరావు గారు. యువభారతి సంకలనాలలోని కొన్ని , మరికొన్నిటిని కలిపి అక్షతమయిన తన కవితా సుమాలను కూర్చి వికసింపజేశారు. దాని పరిమళాన్ని ప్రసరింపజేయడానికి యువభారతికి అవకాశమిచ్చి దానిని యువభారతి తేజోమూర్తి ఇరివెంటి కృష్ణమూర్తిగారికి అంకిత మిస్తున్నందులకు శ్రీ పురుషోత్తమరావుగారిని అభినందిస్తూ కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

**మాడభూషి అనంతాచార్య**
**అధ్యక్షుడు, యువభారతి**

హైదరాబాదు:
**తేది : 4-9-2007**

# కృతజ్ఞతలు

నా కవితలన్నీ గుదిగుర్చి ఒక సంకలనం చేయాలని తలంపు వచ్చింది. ఈ కార్యభారాన్ని మా అన్నగారైన శ్రీ పసుమర్తి రంగారావుగారు తమ అల్లుడైన సాహితీవేత్త డా॥ పింగళి జగన్నాథరావుకు అప్పగించారు.

ఆయన ఎంతో శ్రమకోర్చి శ్రద్ధగా మార్పులు, చేర్పులు చేసి చక్కని ప్రతిని అందజేసారు. "అక్షతలు" అని నామకరణం చేశారు. ఆయనకు కృతజ్ఞుడను.

నా కవితా కృషికి ప్రేరకులు అప్పటి అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు. అందుకని వారికే ఈ కవితా సంకలనం అంకితం.

ఈ కవితలకు, ఆశీస్సులు అందించమని జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు, పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డి గారిని అర్థించాను. ఆయన అత్యంత ప్రేమాస్పదులై అభినందన మందారాన్ని అందించారు.

మా యువభారతి పూర్వాధ్యక్షులు, చిరకాల మిత్రులు, భువన విజయ కవిమిత్రులు, గొప్ప విమర్శకులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు గారు చక్కని ప్రశంసలందించారు.

యువభారతి అధ్యక్షులు శ్రీ మాడభూషి అనంతాచార్యులు యువభారతి పక్షాన ఈ కవితా సంకలనాన్ని ప్రచురింప జేయటమే కాక చక్కని సందేశాన్ని అందించారు.

యువభారతి సమావేశ కర్త గొప్ప పరిశీలనాత్మక దృష్టితో కవితలను ఆసాంతం చదివి తమ అమూల్యమైన సలహాలను ఇచ్చి ఈ కవితా సంకలనాన్ని శోభింపజేసారు.

యువభారతి ప్రచురణగా ఈ కవితా కదంబం "అక్షతలు" వెలువడుతున్నందుకు మహదానందంతో యువభారతి మిత్రులందరికీ కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

నాకు తగిన సూచనలు యిచ్చిన యువభారతి కార్యదర్శి శ్రీ రెడ్డి రాఘవయ్యగారికి, యువభారతి మిత్రుడు శ్రీ తాళ్లపల్లి మురళీధర్ గౌడ్‌కు, ముఖపత్ర రచనతో "అక్షతలు"ను అందంగా తీర్చిదిద్దిన యువభారతి మిత్రుడు శ్రీ జీడిగుంట వెంకట్రావుకు నా ప్రత్యేక కృతజ్ఞతలు. డి.టి.పి ఓర్పుతో చేసిన అలకాపురి కిరణ్‌కి, అందంగా అచ్చువేసిన కర్షక్ ప్రెస్ వారికి కృతజ్ఞతలు.

కవితాభిమానులు నా ఈ చిరుకానుకను ఆదరిస్తారని ఆశిస్తూ

**– అయ్యదేవర**



నా పెత్తల్లి చింతలపాటి వేంకటరామమ్మ; నా చినపెత్తల్లి మీనవోలు లక్ష్మీబాయి; నా జనని జమలాపురం దుర్గాంబ; నా పెంపుడు తల్లి అయ్యదేవర రంగనాయకమ్మ

- అయ్యదేవర పురుషోత్తమరావు

# విషయసూచిక

# అంకితం

"రాత్రి రామదాసు వేసింది మీరేనా?"
అని ముందుగా పలకరించిన రసహృదయుడు.
"యువభారతికి రండి" అని
నన్ను ఆహ్వానించిన సాహితీ ప్రియుడు.
యువభారతికి మా రాకపోకలలో
కురిసిన హాస్యపు జల్లులు కోకొల్లలు.
దివాకర్లవారు నన్ను
శ్రీకృష్ణదేవరాయలను చేసినప్పుడు
నన్ను శ్రీకృష్ణదేవరాయలను
తీర్చిదిద్దిన మహామంత్రి తిమ్మరుసులా -
నా పాత్ర పోషణకు
అపర తిమ్మరుసై నన్ను తీర్చిదిద్ది
తానే తిమ్మరుసుపాత్ర ధరించిన కళాభిమాని.
స్వాతంత్ర్య సమర యోధుడు
సాహితీ మూర్తి - సహృదయ శేఖరుడు
మా ఇరివెంటి కృష్ణమూర్తి మహోదయునకు
వినమ్రమతినై ఈ చిరుకవితా కదంబాన్ని
"అక్షతలు" అంకితమిస్తున్నాను.



స్వర్గీయ
**డా. ఇరివెంటి**
**కృష్ణమూర్తి గారు**

శ్రీకృష్ణాష్టమి
4 సెప్టెంబర్, 2007

- అయ్యదేవర పురుషోత్తమరావు

# రెండు కొమ్మల ఊయల

అమ్మ – ప్రేమకు ఆదిమూలం
అమ్మ – ప్రకృతి అపరావతారం
అమ్మ – పరమాత్మ ప్రేమావతారం
అందరికీ ఒకే అమ్మ – కాని
నాకు ఇద్దరమ్మలు –
వాళ్ళిద్దరూ అక్కాచెల్లెళ్ళు
పదినెలలు మోసికన్నది ఒకరయితే
ఆలనా పాలనా చూసింది ఇంకొకరు
వెరసి, రెండింతలైన నా అదృష్టం.
రెండు కన్నులు ఒకే చూపులా
రెండు మనసులు ఒక మాటలా

*****

అమ్మ నన్ను అక్కున హత్తుకొని పడుకొన్న రాత్రి
మేనినిండా సొమ్ములున్నా "అమ్మరా అమ్మ" (అమ్మను చూసి)
అంటూ
మాతృత్వం మేల్కొల్పిన మానవత్వం
వెనుదిరిగి వెళ్ళిపోయారట దొంగలు.

*****

పిల్లలకోసం హనుమంతుడికి ప్రదక్షిణలు చేయవచ్చిన మాపిన్ని
కొంగుపట్టుకు తిరిగానట నేనుకూడా ముద్దుపలుకులు పలికే
మూడేళ్ళనాడు
కన్న ప్రేమ కన్నా పెంచిన ప్రేమ మిన్న !
కణ్వ శకుంతలల గాథ తెలియంది కాదుగదా

కన్నతల్లి దుర్గాంబకు అంతదూరాన వున్నా
కనక దుర్గమ్మ కనుల చల్లదనం కారణంగా
కృష్ణవేణమ్మ నీరు తాగడంతో పాటు
అల్లారుముద్దుగా చెప్పిన కథలన్నీ
ఆమె ఒడిలో పెరుగుతూ విన్నాను

* * * * *

నేను చదివింది తక్కువే
సేకరించిందే ఎక్కువ
నా కళా జీవితానికి అదే నాంది
అందుకు ఆ రంగనాయకమ్మ కారణం
కోరింది చేసింది, చేసి పెట్టింది.
కొండంత కొడుకును నేనని నన్నాదరించింది.
'మాతృదేవోభవ' అన్న సూక్తి
అన్వర్థమైంది ఆమెపట్ల
రెండు దశాబ్దాలు ఆమె ఆలనలో
నిర్విచారంగా నా జీవితం సాగిపోయింది.
'వేయిపడగలు' చదివి ఆనందంతో
ఆమధ్య మాఅమ్మ దుర్గమ్మ అందిగదా
'ఇది వ్రాసినాయనేనారా నీ గురు' వని
అవునన్న నా మాట విని
'ఎంత అదృష్టవంతుడివిరా' అని విస్తుపోయింది
ఆయన అస్తమించిన వార్త విని
నన్ను ఎంతగానో ఓదార్చింది
నేను వేసిన కృష్ణపాత్ర చూసి

'తల్లి దృష్టి సోకకూడ దని
చూపులు దించుకొన్నా' నంది
అదే ఆ అమ్మ ఆశీస్సు.

* * * * *

వృత్తి రీత్యా వచ్చిన మహానగరవాసం
తలపునకు తెచ్చింది అమ్మల్ని యిద్దర్నీ
ఏ ఒక్కరూ దగ్గర లేని కారణంగా
నేననుకొన్నాను ఆర్తితో
అభేదం గల ఆ అమ్మలనే
రెండుకొమ్మల వాత్సల్యపు ఊయలలో
హాయిగా ఊగిన అదృష్టజీవిని నేనని.

---

1980 'ప్రియజనని' రావూరి భాషాకుటీరం ప్రచురణ

## రవ్వలు ! రవ్వలు !! రవ్వలు !!!

రవ్వలు !
రవ్వలు !!
రవ్వలు !!!
మాతృదేశ రక్షణకై
భారతవీర సైనికుల
తీక్ష్ణ వీక్షణాంచలముల
నెగసి దూకే నిప్పు రవ్వలు
రవ్వలు !
రవ్వలు !!
రవ్వలు !!!
హృదయనైర్మల్యం
జాతి సౌశీల్యం
ప్రజల ఐకమత్యం
జాతి గాంభీర్యం
చూచి ఓర్వని
నీచమతులకు
గుణపాఠం చెప్పాలని
జాతి ఎదనుండి ఎగిరిపడే
రవ్వలు !
రవ్వలు !!
రవ్వలు !!!
నిప్పురవ్వలు !
తుపాకిరవ్వలు !!

ఎదుటి బాగు ఓర్వలేని
తనదు బాగు చేతగాని
కుత్సితమతులకు శాస్తి అయ్యేలా
చెనటుల దుర్మార్గం శిక్షించే
భరతవీర సైనికుల
భుజసీమల పైనలరారే
శత్రు మారణ శతఘ్ని కుండంలో
చిటిలిపేలిన అగ్నికణాలు
రవ్వలు !
రవ్వలు !!
రవ్వలు !!!
నిప్పు రవ్వలు !
తుపాకి రవ్వలు !!
పరదేశపు దుర్మార్గానికి
పరరాష్ట్రపు దురాక్రమణకు
కాగి మాగిన జాతివీరుల
హృదయసీమల్లో వెల్లి విరిసిన
క్రోధమయారుణ నేత్రజ్వాలల
కుండం నుండి ఎగిరిపడే
రవ్వలు !
రవ్వలు !!
రవ్వలు !!!
నిప్పు రవ్వలు !
తుపాకి రవ్వలు !!

సౌహార్ద్రానికి అపార్థం కల్పించి
సౌజన్యాన్ని అసమర్థతగా నెంచి
గిల్లి కజ్జాలకు కాలుదువ్వే
ముష్కరమూకల భరతంపట్టే
మడమ దిప్పని జాతివీరుల
మరఫిరంగుల నుండి వెడలిన
మారణాయుధ కాంతులు
రవ్వలు !
రవ్వలు !!
రవ్వలు !!!
నిప్పు రవ్వలు !
తుపాకి రవ్వలు !!
నియంతృత్వపు మృత్యు ఘోషల
దుష్టస్వార్థపు తుచ్ఛ వాంఛల
వసుధపైనిక రూపుమాపగ
ఆకాశపుటంచుల కెగసే
శత్రువిమానపు దాడుల నణచగ
కాల్చి పేల్చిన విమానశతఘ్నుల
రవ్వలు !
రవ్వలు !!
రవ్వలు !!!
నిప్పు రవ్వలు !
తుపాకి రవ్వలు !!

---

'తుపాకి' రవ్వలు 'నదీరా' సమర కవితా సంకలనము

# నవభారతం

ఎందరెందరో ధరను కార్చిన రుధిర ధారలు
ఎందరెందరో ధార పోసిన త్యాగ ఫలములు
ఏకమై పగవారిగుండెలు రగిలించి కరిగించి
పుడమి వెలసిన పుణ్యఫలం, ఈ స్వాతంత్ర్యం

తరతరాలుగ తరలి వచ్చే ఖ్యాతులు
సత్యా హింసలు సమతా జ్యోతులు
శాశ్వతమై వెలయునట్లు
జాతికీర్తులు వెలుగునట్లు
ఈర్ష్యాసూయలనీడ్చివైచిన
నవ భారత నిర్మాణానికి
నాందీ ప్రస్తావనలు అవే
ధర్మ సంస్థాపన అదే.

# దాత

శిబి మేనికండలు చెండి యిచ్చినప్పుడు
భువిని చిందిన రక్త బిందువు
కర్ణుడు తన కవచాన్ని కోసియిచ్చినప్పుడు
నేలరాలిన ఆనెత్తురుచుక్క
ఒక దాతగా ఉద్భవిస్తుంది
అర్థుల భాగ్యదేవతగా రూపుదాలుస్తుంది

# ప్రత్యూషము

కుక్కుట కంఠనాళ కొక్కురో ధ్వనులు
ముక్కుకు తాడుపోసిలాగే ముగుతాళ్ళు
గోవత్సపు 'అంబా' అను అరుపు
పాలికాపు ప్రత్యుదయం మేలు కొలుపు

అరుణోదయ మఖిలానికి దివ్య దృష్టి
కరుణోదయం నిఖిల కావ్యసృష్టి
భాను కరనికర భాగ్యోదయమ్ము
బ్రతుకులోపల కలుగు నిత్యోత్సవమ్ము

ప్రభాతసంధ్యలలో ఈ సకల జగము
ప్రబోధగీత మలరారునిజము
రవి సాగిన జగతి తలమది
కవి సాగిన ప్రగతి పథమిది

రవి కానని దది కవిగాంచును
కవియే ఈ భువిలో హరి అని ఎంచుము
"సర్వే జనా స్సుఖినోభవంతు
సర్వే భద్రాణి పశ్యంతు"

ప్రకృతి కావ్యానికి ఇంధనం
ప్రకృతి నారాధిస్తాడు కవి
కావ్యాలు సృష్టిస్తాడు
జీవితాలు వికసింపజేస్తాడు.

## భావన

ఎందరు లేరు భాగ్యవంతులు
అందరికీ ఈవి అబ్బుతుందా
ఎందరు లేరు సంపన్నులు
అందరికీ దానగుణ మలవడుతుందా
ఏ శుభవేళలో అనుకుంటారో ఆ ధర్మాత్ములు
తమధనాన్ని కొంత 'కళ'కు వెచ్చించాలని

కళా హృదయులనూ కవనశీలురనూ
ప్రభుత్వం పోషించాలంటారు
ఇది ప్రజా ప్రభుత్వం కదా – ప్రజలే ప్రభువులు
కళ ప్రజల కోసం – ప్రజలే పోషించాలి
ఉన్నవాళ్ళు – కళా హృదయం ఉన్నవాళ్లు
కళా పోషణ చేయాలి
కళ జాతి వెలుగు కనుక
కళ దేశ సంపద కనుక
స్వర్ణయుగం – ఎక్కడో లేదు
మన చేతిలోనే ఉంది
మనం జేసే కార్యాలలోనే ఉంది
మన జాతీ భాషా స్వర్ణ మయం కావాలి
మన కీర్తివిజయపతాకం విను వీధులలో ఎగరాలి

## విజ్ఞాన ఖని - వీరేశలింగం

తెలుగుతల్లిని రత్నగర్భగ
తీర్చిదిద్దిన ఘనుడెవండు
తెలుగుజాతికి వన్నెకెక్కిన
తెన్నుచూపిన ధీరుడెవడు

తెలుగుభాషకు ప్రజల భాషగ
వెలుగు చూపిన ద్రష్ట ఎవడు
తెలుగు వెలుగై తేజరిల్లగ
జిలుగు పలుకుల తేనెలొలుకగ
దివ్య పథముల చూపిపోయిన
నవ్య శోభలు వెలయ చేసిన
విజ్ఞుడా వీరేశలింగము
వెలుగు జిమ్మే విస్ఫులింగము

జగతి కలిగిన యన్నినాళ్లు
తెలుగు తన మదియున్ననాళ్లు
నిలచియుండును అతని కీరితి
వెలయుచుండును అతనిమూరితి

## చందమామ

ఆకాశవీధిలో
అందాలవాడ
రాకాసి రాజ్యాన
భయమేమిలేద ?
నీయింట ముసలమ్మ
నినుజూచు చల్లగ
గుగ్గిళ్లతినును
రాట్నమే వడుకును
చెట్టుకిందా చేరి
కళ్ళు చికిలించు చుండును

బోసిన నవ్వుల ఆ అమ్మ
పాపాయి బోలు
నీలోని ఆలేడి
ఆడేను హాయిగా
అది ఎంత అందమో !
అది ఎంత చందమో
అది చూడ అందరూ
అఱ్రులే చాచుదురు

ముక్కంటి దేవత
సిగ ఎక్కి ఉందువు
ఆ బైరాగి దేవునికి

అందమయ్యా నీవు
మదనుడు ఎవరోయి
మంచి వాడేనా అతడు
నీకు చెలికాడ
నాకు చూపెడతావ ?
కానరాడని అతడు
అంటారు అందరు
నిజమెంత వరకో అది
నిన్నడిగితే మేలు.

నీ శివుడే కాల్చెగా
ఆ మదనదేవుని
మంటలో మాయించె
బూడిద గావించె

శివునెత్తి పై నెక్క
గలవాడవీవు
చెప్పలేకుంటివా
అప్ప చెప్పావ కళ్లు
స్నేహితుని చెరుపంగ
చూచుట న్యాయమా ?
నిలువగానేల ఆ మిడిమేలపు కొలువున
ఏమి ? హృదయమునీది ?
ఏమి ? ధర్మమునీది ?
అతనిసతి రతీదేవి

అతనుడు ఐనాడిలా
సతీపతుల విడదీసె
ముక్కంటి మాయ
అమృతము నీ వంద్రు
చెలికానిపై చిలికి
కాపాడలే వైతివా
కాలకంఠుని సిగపూవ

అమ్మ మామా ! నిన్ను
నమ్మకూడదు గదయ్య
అందనివాడవు
నీ అందముతో పనియేమి
ఆకాశమందున
అట్టే వుండుము నీవు

---

'కాంగ్రెస్' వరంగల్ వారపత్రిక

# దేముడు

జన్మనిచ్చేవాడు
జీవితాన్ని సాగించేవాడు
ఈమధ్య పడుతున్న
ఒడుదుడుకులు
చూస్తూ ఉండేవాడు

ఇద్దరుంటే చాలు
అని మొత్తుకునే మనకు
పుట్టించు వాడొక డున్నాడని తెలియకా ?
నారు పోసేవాడు
నీరుపోయడా అని
అంటారు అందరూ
అంత వేదాంతం
అందరికీ అలవడితే
ఈ జనానికి
గంగ వెర్రులు ఎందుకు
నేను - నాది
నాకు ఎందుకీ స్వార్థం ?

అందరూ అతని సృష్టి అయితే ఎందుకీ తేడాలు ?
మనకన్నా చాల తెలివైనవాడు కాకపోతే
మన్నెందుకు సృష్టిస్తాడు ?
పుట్టించేవాడు ఆయనే అయినా
ఎవరి కర్మలను పట్టే వారు పుడతారు
చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ.

# నడిపించు ధర్మచక్రం

నడిపించు ధర్మచక్రం
కనిపించు కాలచక్రం
వెలయించు ధర్మసూత్రం
నియమించు శాంతిమార్గం
        సాగించు క్రాంతిరథం
        లయించు ద్వేషపథం
        సాధించు ప్రేమతత్వం
        రూపించు స్నేహభావం
బోధించు జ్ఞానసూత్రం
చూపించు ధర్మమార్గం
లోకాల శాంతికోసం
వహియించు స్నేహభావం
        తమసంపు నీచభావం
        దమియించు నీవు శీఘ్రం
        వెలిగించు స్నేహదీపం
        వెలయించు ప్రగతిసూత్రం
నడిపించు ప్రేమదౌత్యం
విడిపించు లౌల్యభావం
విశ్వైక శాంతి కోసం
వెలిగించు తృప్తిదీపం
        ఎగిరించు జయ పతాకం
        పూరించు విజయ శంఖం
        మ్రోగించు ఐక్యభేరి
        వినిపించు 'జై నినాదం

---

1965 వరంగల్ 'కాంగ్రెస్' వార పత్రిక

# సరిగ్గా అప్పుడు చూడు

సాగిపోతున్న బండిచక్రం
సీల జారిపోయింది
పర్వతారోహణంలో
కాలుజారిపోయింది
సందడిగాఉన్న పెళ్ళిపందిరికి
నిప్పురవ్వ అంటుకుంది
ఎడారిలో పాంథుణ్ని
పెనుగాలి పెనవేసుకుంది

ఆశ్వమేధహయం
కనుపించకుండా పోయింది.
ప్రకటించిన పాత్రధారి
అంతుతెలియలేదు
ప్రదర్శన శాలనుండి
క్రూరమృగం తప్పించుకుంది
అందమైన అమ్మాయి
తుంటరికి ఒంటరిగా కనుపించింది

చిలిపిపిల్ల
చిరునవ్వు చిందించింది
త్రాచుపాము
తోక త్రొక్కటం జరిగింది
ఆవు దూడను పెట్టింది
మాయవేయలేదు
పిచ్చివానిచేతికి
పదునైన కత్తి దొరికింది

కుండెడు పాలల్లో
విషబిందువు చిందింది
పిల్లలున్న ఇంట్లో
ఎలుకలమందు మాయమైంది
అమాయక ప్రజలకు
అపకారం జరిగింది
సమరంలో
నాయకుడు కనుపించటం లేదు

మంచిమనిషి
మనసు వికలమై పోయింది
తలుపులు వేసి
పిల్లిని కొడుతున్నారు
పేదవానికి
పెన్నిధి లభించింది
వెలయాలు
పవిత్రబంధం అర్థించింది

ప్రవాహానికి
అడ్డుకట్ట తెగిపోయింది
శుభకార్యానికి పోతుంటే
అపశకునం ఎదురైంది
కలసిఉన్న కొన్నాళ్ళకు
కామమ్మ మగడు కాదని తెలిసింది
తప్పు కప్పి పుచ్చటానికి
చేస్తున్న తప్పులు కుప్పలు పడుతున్నాయి

---
యువభారతి 'ఉషస్సు' కవితా సంకలనం

# వయసు

ఊరి వెలుపల తోటలోపల
వెలసిందొక అందాలమేడ
సుఖసంతోషాలకు నీడ
మేడలో ఉన్న కుటుంబం జాడ
నిండుగుండె ఉండాలేకాని
ఊరికి వెలుపల ఉంటేనేం
లోపల ఉంటేనేం ?
మేడలోని దంపతులూ
వారి సంతానం ముప్పురూ
మగపిల్లలు పెద్దవాళ్లు అడపిల్ల ఆఖరిది
అందరికీ ఆత్మీయులు ఎందరికో నేస్తాలు
పెద్దవాడు పెండ్లీడుకు వచ్చాడు
చిన్నవాడు నూగు మీసాలతో తూగుతున్నాడు.

* * * * * *

ఆడపడుచు అత్తింటికి చేరుకుంది
నట్టింట అందెల సవ్వడులు కరువైనయి
సందె దీపం తన వెలుగు కళ్ళతో
ఆడపిల్లను చూసే అవకాశం కోల్పోతున్నది

ఇల్లాలనుకొన్నది కోడలు కావాలని
అందం-చందం-వయసు-మనసు
బుద్ధి-భాగ్యం-వినయం-వివేకం-
అన్నీ ఉన్నయి పెద్దబ్బాయికి
చిన్నవాడు అన్నిట్లో చిన్నవాడే
అందంమాట ఎందుకులెండి !

చందంమాట వింటేనే చచ్చినంత పనౌతుంది
మనసు వంకర-మాట వంకర
నడత - నానావంకర
అన్నకు వినయమెక్కువ
తమ్ముడికి పొంగిపొర్లే పొగరెక్కువ
అన్న సంస్కారం పెద్దలది
తమ్ముడి సహవాసం నీచులది

* * * * * *

తల్లి మనసు తల్లడిల్లింది
వయసు పొంగున వన్నె తరిగిన
చిన్నవాడిని చూచి
కుమిలి కుమిలి ఏడ్చింది
పెళ్ళిచేస్తే కట్టుబడిపోతాడనుకుంది
పెద్దవాడికైతే కదా వీడికి పెళ్ళి ?

అతడ్ని కదిపిచూసింది
తనకు తొందరలేదన్నాడు
చదువుమీద మమకారం అన్నాడు
సంసారంభారం వద్దన్నాడు
తమ్ముడికి ముందు పెళ్ళి జరిగితే
తనకూ సంతోషమేనన్నాడు

* * * * * *

చిదిమిదీపం పెట్టుకునే సంబంధం వచ్చింది
పెండ్లికి తొందరలేదన్న పెద్దకొడుకు
పెళ్ళాన్ని యింటికి తెచ్చుకున్నాడు
అమ్మగుండె వెన్నెలలా విరిసింది
అందాల పున్నమినాటి సంద్రంలా పొంగింది

అన్నకు నచ్చిన పడుచు తమ్ముడికీ నచ్చింది
తన సొత్తును అన్నకాజేశాడని ద్వేషం పెంచుకున్నాడు
తన్నుతాను మరిచిపోయాడు
తారతమ్యం విడిచివేశాడు
అతని చూపులలో కామం
మనసులో క్రోధం

బ్రతుకులో ప్రతీకారం
పెనవేసుకుపోయినయి
వదిన ఆప్యాయతను అర్థంచేసుకోలేక
తన్నుచూసి మురిసిపోతున్నదని భ్రమపడ్డాడు
* * * * * *

ఆ రాత్రి ఇంట్లో వదిన ఒక్కతే పడుకుని ఉంది
మరిది మనసులో అశాంతి మరీ ఎక్కువైంది
అశాంతి పెరిగినపుడు మనిషికి సుఖముండదు
మరది వదినను తాకినాడు
ముచ్చెమటలతో తడిసిన చేతితో
వదినె మేల్కొన్నది
మరది మదిలోని కలవరాన్ని అర్థం చేసుకున్నది
కొంగుతో అతని చమట తుడిచింది
ఆప్యాయంగా పలకరించింది
అప్పుడామె చూపుల్లో తల్లి కనిపించిం దతనికి
చేసిన తప్పును తెలిసికొన్నాడు
'వదినా!' అన్నా డతడు ఆర్తిగా
'బాబూ!' అన్నది ఆమె ఆప్యాయంగా

---

యువ భారతి కవితా సంకలనం నుండి

## లోకం

ఇంట రంభవంటి యిల్లాలున్నా
పడుపు పడతికోసం ప్రాకులాడుతారు

మొక్కులు మూలవిరాట్టుకు
ఊరేగింపు ఉత్సవవిగ్రహానికి
పేరు గురువులది
స్వాహా శిష్యులది

బ్రతికుండగా కనీసం పలకరించనివారు
చచ్చింతర్వాత చిత్రపటాలు పెట్టి పూజిస్తారు

ఉన్న ఊరిలో ఎరగని వారెవరని
పొరుగూరిలో ఎరిగిన వారెవరని
పాపం కొత్తకోక కట్టుకోలేకపోయిందిట

పరాయివాళ్ళకోసం పరుగులు తీయటం
నేలనువిడిచి సాముచేయటం

ఏదో వస్తుందన్న ఆశతో
ఉన్నది ఊడిచిపెట్టుకోవటం

---

యువభారతి కవితా సంకలనం నుండి

# అనుభవం

అనుభవం ఏమంటున్నది ?
సన్నగా నవ్వి ఊరుకుంటున్నది
నన్ను కదిలించకు - తరువాత వదిలించుకోలేవంటున్నది
కాదు కూడదంటే - కుండ బద్దలుకొడతా నంటున్నది
జీవితం తీపీ పులుపేగాదు
వగరూ చేదూ కూడా అంటున్నది
మంత్రసానితనం ఒప్పుకున్న తరువాత
ఏదివచ్చినా పట్టాలంటున్నది !
గతం ఒరిగించింది లేదు కాబట్టి
వర్తమానం వక్రగతులకే నిలయం కాబట్టి
భవిష్యత్తులు ఎండమావులే అంటున్నది !
అనుభవం ఏమంటున్నది ?
ఆశ జీవితానికి సోపానం అంటున్నది
అందుకే మనుగడ సాగించాలంటున్నది
పేరుచూసి భయపడవద్దంటున్నది
పేరులో ఏముంది నా బొంద
పెట్టిపుట్టాలంటున్నది దేనికైనా
ఎన్ని ఉగాదులు మారినా
అనాదిగా వస్తున్నదే మనదంటున్నది.
'చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ' అంటున్నది.
ఎంతచెప్పినా ఏం ప్రయోజనం లేదు
చేయదలచుకొన్నది చేసెయ్యమంటున్నది
'ఆలస్యం అమృతం విషం'
అంతమాత్రం తెలియదా ! అంటున్నది
ప్రకృతిలో లేదు మార్పు పురుషుడిలోనే ఉందంటున్నది
అనుభవం ఏమంటున్నది !
గతం వర్తమానానికి పునాది అంటున్నది.

# గగనకుసుమాలు

ఆకాశంలో అక్కడక్కడా
మినుకు మినుకుమంటున్న చుక్కలు
అందని గగనం పూలతోటలో
ఆశల కుసుమాలు

నీలాకాశంలో మబ్బులు తేలియాడుతున్నయి
ఉన్నవాడు ఊహకంతులేకుండా ఊళ్ళేలుతున్నాడు
నిండుకుండ నిలకడగా తొణకనంటున్నది
కలవాడు కలిసి రానంటున్నాడు

ఇహంలో పదిమందికి పనికిరాని పాపిష్టివాడు
పరంలోనూ పాపమే మూటకట్టుకుంటున్నాడు
ఇక్కడ యింత యిచ్చి పుచ్చుకోలేనివాడు
ఎక్కడో వెలగబెడతాడని ఏం నమ్మకం ?

నీ వూరే నీకు అంత మంచిగానప్పుడు
పొరుగూరి పట్టాభిషేకం ఎలా కుదురుతుంది ?
మంచిపనికి మహా ముహూర్త మెందుకు ?
పరమేష్ఠి సృష్టికి తగుదునని తప్పుపట్టినట్లు !

ఎదటివాడికి ఎంత ఉండి ఏంలాభం ?
తనదంటూ అంతో యింతో ఉంటే తప్పు!

---

యువభారతి కవితా సంకలనం నుండి

# పిలుపు

అయ్యా ! రండి ! ! అమ్మా ! రండి !!
మీ రందరూ రావాలి
ఇది ఏ ఒక్కరి యింట్లో పెండ్లిగాదు
ఇది విశ్వమానవ కల్యాణం !

అందరూ తలాఒక చెయ్యి వేస్తేనే గాని జరిగేదికాదు
బాబూ ! మీరూ రావాలి ! !
అమ్మా ! మీరూ రావాలి ! !
ఆలస్యం చెయ్యకండి !
మా చేతనేమౌతుందని అనుకోకండి

'ఉడుతా భక్తి' అన్న సామెత మీరెరుగరా ?
మీలో 'నీలులు' ఎందరున్నారో ఎవరికెరుక !
ఇక స్వామి కార్యమే స్వకార్యం
అనుకొనే హనుమంతు లెందరో ?

ఈ పల్లకీ అందరూ మోయవలసిందే
ఇక మీరు ఆలోచించకండి
మీభుజం కూడ ఆనించండి
ఇది ఏ మహారాజు తలపెట్టిన కార్యమూ గాదు

ఈ యుగంలో ప్రతి పౌరుడు మహారాజే
ఆజ్ఞాపించేవాడు లేడు
పాలించటం తప్ప
మనిషి మనీషిగా తలచిన మహాయజ్ఞం యిది
దయచేసి అందరూ పాలే పోయండి !

ఇది మన యింట్లో పెళ్ళి
ఇక్కడ అంతా మనవాళ్ళే
ఈ కార్యం మీనుంచే కావాలి
మీ చేయి తగలాలి
ఏ ఒక్కరూ వెనుకాడకండి
అందరికీ మేలుచేయండి.

ఇది అందరి అభ్యుదయం
ఆకాంక్షించే మహాయజ్ఞం
అందరూ తలాఒక సమిధ వేస్తేగాని కొనసాగేదికాదు.
మానవసేవే మాధవసేవ
మంచి, మమత మానవజాతికి మరోపేరు
మంచికార్యమే మహాయజ్ఞం

---

యువభారతి కవితా సంకలనం నుండి

# అవసరం

వయసుకు సొగసు
వలపునకు వయసు
కవితకు ధ్వని
కార్మికుడికి పని –

శక్తికి యుక్తి
భక్తికి అనురక్తి
స్నేహానికి త్యాగం
రాగానికి యోగం –

సంగీతానికి శ్రుతి
సాహిత్యానికి మతి
ప్రగతికి ధనం
ప్రజలకు వివేచనం –

జీవితానికి ఆశయం
గౌరవానికి అతిశయం
మహితాత్మునికి మార్గదర్శనం
మహాకావ్యానికి సందర్శనం

అవసరం
చాలా అవసరం

---

యువభారతి కవితా సంకలనం నుండి

# నువ్వెంత

లోకాన్ని మరమ్మతు చేయటానికి పూనుకోకు
కాకుల్ని హంసల్ని చెయ్యటం రాదు నీకు
ఈ లోకం తీరే అంత
మనజాతకం మారాలి కొంత
మళ్లీరావాలి ఆరోజులు
పోవాలి ఈ రోజులు
కాలానికి ఎదురు నిలువలేవు
కాలహి కాని అది వేరుకాదు
కాల కూటాన్ని కబళించటానికి
కాలస్వరూపుడివి కావు నువ్వు
అలవికాని వేళల
అధికుడనని ఎగసిపడకు
ప్రకృతి వక్రిస్తుంది
వికృతి తాండవిస్తుంది
నింగీ నేల ఏకమయ్యేలా వ్యాపిస్తుంది

కాళ్ళున్నా కదలలేవు
కళ్లున్నా చూడలేవు
చెవులున్నా వినలేవు

చేతులున్నా చేయలేవు
మెదడున్నా ప్రయోజనంలేదు
మరబొమ్మవు
కాలానికి కట్టుబడి
కిమ్మనకుండా కాలం గడుపు
వాలం ఆడించావంటే
అడుగడుగునా కత్తెరలే
అడకత్తెరలో పోకలాంటిది
ఈ అతుకులబ్రతుకు

---

యువభారతి కవితా సంకలనం నుండి

## మలుపు

ఆకాశంలో కాటుకలు విరజిమ్ముతున్నయి
అమావాస్య అర్ధరాత్రి అక్కడక్కడా
తారకలు తళుకు తళుకు మంటున్నాయి
జీవితంలో ఆశలు చిగురింప చేస్తున్నాయి

మంచంలో పడుకున్న 'మల్లి' కళ్లు తెరిచే ఉంది
కన్ను కన్ను పొడుచుకున్నా కనిపించడంలేదు
కన్ను మూసినా కన్నుతెరచినా చీకటే
ఆలోచనలు అనంతంగా ఆమెలో వస్తున్నయి,

అవి యివి అని చెప్పటానికి వీలులేదు
ఏదో చూస్తున్నది కానీ, ఏమీచూడటం లేదు
ఏదో అనుకుంటున్నది, కానీ ఏమీ అనుకోటంలేదు
కునుకురావటం లేదు కంటికి

అంతలోనే ఏదో అలజడి
అలలు అలలుగా బూట్ల చప్పుడు
చెవులు పనిచేస్తున్నా
మనసు మొద్దువారి పోయింది

తన జీవిత నిశీధంలోకి చంద్రుడు రాడా
బరువెక్కిన ఈ హృదయం తేలికపడదా !
ఎవరో చువ్వలా వచ్చి గుడిసెలో దూరాడు
గుడిసె తడిక చప్పున బిగించాడు

అలికిడైంది కాని లేవలేకపోయింది
నక్షత్రాల్లా ఆమెకళ్ళు మెరుస్తున్నయి

మెల్లగా మంచం మీదికి చేరాడు
మళ్ళీ బూట్ల చప్పుడు, పోలీసు విజిల్సు.

కదులుతున్న ఆమెను ఆక్రమించాడు
కప్పుకున్న దుప్పటి పైకి లాక్కున్నాడు
ఆమె ఉక్కిరిబిక్కిరి అవుతున్నది
పోలీసు వచ్చి తడిక సందుచేసి చూశాడు

చీకటి గుడిసెలో ముసుగుక్రింద ఏదో పెనుగులాట
పోలీసు సిగ్గుతో ముఖం తిప్పుకున్నాడు
సాగుతున్న విజిల్సు క్రమంగా దూరమైనాయి

చౌర్యమే తప్ప క్రౌర్య మెరుగని వాడికి
ఆమె పరిష్వంగంలో పారవశ్యం దొరికింది
పురుష స్పర్శ ఎరుగని మల్లి
జీవితంలో క్రొత్తమలుపులు రుచి చూసింది.

భళ్ళున తెల్లవారింది
ఆమె బ్రతుకు తెల్లవారింది
ప్రక్కన చూసింది ..... ఎవరూలేరు
పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది

వికసించిన కుసుమంలో మకరందాన్నాస్వాదించి
మధుపం మార్గాంతరం పట్టిపోయింది
ఆమె కన్నీరు కాలువలై ప్రవహించినది
గుండెరాయి చేసుకొని గోదాట్లో కురికింది

* * * * * *

అలికిడయితే మెల్లగా కన్నులు తెరచింది
ఆ చీకటిలో అతనిని పోల్చుకోగల్గింది
మరల ఆమె అతని పరిష్వంగంలో ఉంది
అతడు పెదవి విప్పలేదు
ఆమె అంది "నన్నెందుకు చావనియ్యలేదు"
అతడన్నాడు "ఇంతవరకు నేను దొంగను,
ఇకముందు కాదు, నీకు చేసిన అన్యాయానికి
ఇష్టమొచ్చిన శిక్ష నాకు విధించు
నీ అడుగు దాటను
ఆమె హృదయం ద్రవించింది
అపుడు మల్లి భాసించింది
కొప్పులో తురిమిన కుసుమంలా
నీరెండలో వారి నల్లని దేహాలు నిగనిగలు తేలినవి
ఒకటిగా కనుపించే వారి శరీరాలపైని నీటిబిందువులు
ప్రకృతి చల్లిన సేసలుగా గోచరించినై.

---

యువభారతి కవితా సంకలనం నుండి

## వాసంత కవికోకిల

సాహిత్యోద్యానంలో
ఒక క్రొత్త కోకిలారావం
సాహితీ వీధికలలో
ఒక వినూత్న రుతి విన్యాసం
అతడు గొంతెత్తి పాడితే
కోటి కోయిలలు కూసినట్లు
అతడు ఎలుగెత్తి చాటితే
మేటి కవితలు వెలసినట్లు

అందమైన అక్షరాలు
అతని కృతులలోని ఆకృతులు
ఇంపైన మాటలు
అతని పాటలలోని ఊటలు
అతని కవితా పేటిక
నవకవితా వనవాటిక
అతని కవితా ప్రసూనాలు
ఆరబోసిన అందాలు

అతని కవితలు వెదజల్లు
రసిక హృదయాల పన్నీటిజల్లు
తెలుగుతనం నిండిన మనిషి
కవితలో ఎదిగిన మనీషి
అతని వాక్కున

వసించు నిఘంటువు
అతని హృదయం
ఒక సుధాభాండం

అతని పలుకులు ముద్దులొలుకు
అతని కవితలు తేనెలొలుకు
కవిత కాతడు మారుపేరు
యువత కాతడు ప్రతీక

కవితా విహాయసంలో
మరో హరి విల్లును వెలయించిన,
మంటలలో మనిషిని చూసిన
మానవు డాతడు మహోన్నతుడు

కస్తూరిని వెదజల్లే
కర్పూర వసంత రాయడు
కవితాశాఖికల గానం చేసే
కమనీయ కవి వతంసుడు

---

యువభారతి కవితా సంకలనం నుండి

## స్థితప్రజ్ఞుడు - సినారె

ఏడు దశాబ్దాలు నిండిన మహామనీషి
జీవితంలో అన్ని పీఠాలూ ఎక్కి చూసినవాడు
కవిత్వంలో మధ్యందిన మార్తాండుడు కాదు
శరత్పూర్ణిమా చంద్ర సదృశుడు

పుట్టింది కరీంనగరంలో అయినా
పాగావేసింది హస్తినాపురంలో
తెలుసుకున్నది తెలుగు కవిత్వమే కాదు
ముషాయిరాల మహత్తులు కూడా

పాటరాస్తే మనసు పరవళ్లు తీయాలి
కవిత చెపితే ఎదహొయలు పోవాలి
అచ్చమైన తెలుగు మనిషి
పోలికలో కృష్ణశాస్త్రి
ఆలోచనలో విశ్వనాథ

తనదైన బాణీలో కవితా క్షేత్రాన్ని
తవ్విపోసిన గొప్ప కర్షకుడు
సింగిరెడ్డి కుల భూషణుడు
సినారె అనిపించుకున్నవాడు

సినిమా పాటలలో సాహిత్యం
చొప్పించిన నయశాలి
నిత్యం ప్రకృతిలో
క్రొత్తను వెదికే ప్రగతిశీలి
సముద్రమైన కవిత్వం పైన
తనదంటూ ఒక ముద్ర గలవాడు

తల్లి సరస్వతికి తప్ప తలవంచని ధీరుడు
జ్ఞాన పీఠం అధిష్ఠించి రాణ కెక్కినవాడు

---

యువభారతి కవితా సంకలనం నుండి

# ఒక్కటే

కన్నులు రెండైనా
చూపు ఒకటే
వీనులు రెండైనా
వినికిడి ఒక్కటే
ముక్కుపుటాలు రెండైనా
శ్వాస ఒకటే
పెదవులు రెండైనా
పలికే పలుకు ఒక్కటే
చేతులు రెండైనా
చేత ఒక్కటే
కాళ్ళు రెండైనా
నడక ఒక్కటే
చక్రాలు రెండైనా
బండి ఒక్కటే
నింగీ నేల రెండైనా
ప్రకృతి ఒక్కటే
రాత్రి పగలు రెండైనా
రోజు ఒక్కటే
పడుగు పేక రెండైనా
నేత ఒక్కటే

---

యువభారతం కవితా సంకలనం నుండి

# కాలం

గతం మాసిన గర్భవేదన
వర్తమానం చిగురు జొంపం
భవిష్యత్తు ఆశాకుసుమం
నిన్న నేటికి ఆది
నేడు రేపటికి పునాది
రేపు అశకు ఉగాది
అరుణోదయం
ప్రకృతి పారవశ్యం
ఉదయం
వినూత్న సంచలనం
మధ్యాహ్నం
చండ ప్రచండం
సాయంతనం
తెలియని కలకలం
చీకటి చిత్త చాంచల్యం
చంద్ర దర్శనం
హృదయోల్లాసం
వేగుచుక్క కవితావేశం

---

యువభారతి కవితా సంకలనం నుండి

## జీవితం

వికసించిన కుసుమం కాదు
జీవితం
ఆనందంగా ఆఘ్రాణించడానికి

వడ్డించిన విస్తరికాదు
జీవితం
ఆతురతతో ఆరగించడానికి

పరచిన రహదారికాదు
జీవితం
అనాయాసంగా పయనించడానికి

తీర్చిన సోపానం కాదు
జీవితం
నిరాఘాటంగా ఆరోహించడానికి

పరచిన పట్టు పానుపు కాదు
జీవితం
హాయిగా నిద్ర పోవటానికి

అప్పుడే తీసిన ఫలరసాయనం కాదు
జీవితం
కమ్మగా ఆస్వాదించటానికి

వలచివచ్చిన వధువు కాదు
జీవితం

అనువుగా అనుభవించటానికి

ప్రవహించే జీవనదికాదు
జీవితం
నిరంతరం కొనసాగించడానికి

కోర్కెలు తీర్చే కల్పవృక్షం కాదు
జీవితం
ఇష్టకామ్యార్థాలు తీర్చుకోవటానికి

సశరీర స్వర్గం కాదు
జీవితం
జన్మ సార్థక్యం చేసుకోవటానికి

అమర్చిన రంగస్థలం కాదు
జీవితం
నిశ్చింతగా ఆడి నిష్క్రమించటానికి
కంటకావృత కుసుమం జీవితం
మెలకువగా చేజిక్కించుకోవాలి

విషకలుషితోగిరం జీవితం
విరుగుడు తెలిసి విందారగించాలి

కీకారణ్యం జీవితం
చొచ్చుకుని సాగిపోవాలి

కాల సర్పం గల వైకుంఠపాళి జీవితం
దానివాత పడకుండా దాటుకోవాలి

మశక మత్కుణాల వలసమంచం జీవితం
మైమరచి నిదురించరాదు

పులిసిన ఫల రసాయనం జీవితం
తరుణం తెలిసి ఆస్వాదించాలి

వలచి వచ్చిన విషకన్య జీవితం
వివేకంతో సంచరించాలి

జటాజూట బద్ధ గంగా ప్రవంతి జీవితం
భగీరథ ప్రయత్నం చేయాలి

గారడీ వాడి మామిడి చెట్టు కాదు జీవితం
శాశ్వత రూపం దానికి కల్పించుకోవాలి

భయంకర మహా నరకం జీవితం
స్వర్గతుల్యంగా మలుచుకోవాలి

చెదరిన రంగస్థలం జీవితం
కుదురైన సామర్థ్యం కావాలి.

---

యువభారతి కవితా సంకలనం.

# మహామనీషి - విశ్వనాథ

మహత్తర సాహితీ విహాయసంలో
మహోజ్జ్వలంగా
భాసిస్తూన్న మధ్యందిన మార్తాండుడు
ప్రాక్పశ్చిమ రసార్ణవోద్భూతజలదమై
మధుర కవితా ధారలను
మార్మికంగా కురిపిసున్నాడు
సాహితీ క్షేత్రాన్ని
సస్యశ్యామలం చేస్తున్నాడు
రస సరసిని రంజింప చేస్తున్నాడు
కావ్య కుసుమాలను
వికసింప చేస్తున్నాడు
కవితా కైరవాలను
కందలింప చేస్తున్నాడు
అంబర చుంబి శిఖరాగ్ర మైన
సనాతన సంస్కృతిని
వెలయింప చేస్తున్నాడు
అచ్చర కన్నెలను
లాస్య మాడిస్తున్నాడు
ప్రాచీనాధునిక కవితా స్రవంతీ తీరాలకు
సేతువై నిలచిన వాడు
సాహిత్యా రామంలో
కల్పవృక్షాన్ని పాదుకొల్పి
రామ కథను మరల చెప్పి
మరో వాల్మీకి అయినవాడు
కిన్నెర సానిని

తేనె వాగుగా పారించి
ధర్మార్థాల చెలియల కట్ట చూపి మనీషి అయినవాడు
వేయి పడగల స్వామిని వెలయింప చేశాడు
ఆరు నదులకు వంతెన వేశాడు
విష్ణు శర్మకు ఇంగ్లీషు చదువు చెప్పాడు
మ్రోయు తుమ్మెదను వినిపింప చేశాడు
నేపాల రాజవంశ కథలు అల్లాడు
పురాణ వైరుల చీల్చి చెండాడాడు
అద్వైతమున కాదిశంకరుడట్లు
సంప్రదాయ సాహితిని సముద్ధరించాడు
జ్ఞానపీఠం అధిష్ఠించాడు
శిష్య ప్రశిష్యులకు అండగా నిలిచాడు

* * * * * *

పలుకు దారుణాఖండలశస్త్రతుల్యం
మనసు నవ్యనవనీత కుసుమ కోమలం
అతడు సాహితీ సామ్రాజ్య సామ్రాట్టులలో సాటిలేని
విశ్వకవితా విపంచిని మీటిన రసరాట్టు
తెలుగు జాతికి గర్వకారణం
తెలుగు తల్లి పుణ్యాల కడుపు పంట
అతడుత్తుంగ హిమగిరిశృంగం
వివిధ కావ్య సనాథుడు అతడు
విపులాంధ్ర సాహితీ విశ్వనాథుడు.

---

యువభారతి కవితా సంకలనం నుండి.

* * * * *



ఇటీవల హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గాన సభలో ఒక రూపకం 'శ్రీనాథుని కనకాభిషేకం' ప్రదర్శనలో పాల్గొన్న శ్రీ దివాకర్ల వెంకటావధాని (శ్రీనాథుడు), శ్రీ తిరుమల శేషాచార్యులు (అవచి తిప్పయ్య శెట్టి), శ్రీ అయ్యదేవర పురుషోత్తమ రావు (ప్రౌఢరాయలు), శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు (వల్లభ రాయుడు), శ్రీ అక్కిరాజు సుందర రామకృష్ణ (దగ్గుపల్లి దుగ్గన)



## మా అయ్యదేవర వారి గురించి - - - - -

పూర్తిపేరు : **అయ్యదేవర నరసింహ పురుషోత్తమరావు**

జననం : శ్రీముఖ ఆషాఢ శు. సప్తమి శుక్రవారం 1933 జూన్ 30
ఎర్రుపాలెం, ఖమ్మం జిల్లా.

జననీ జనకులు : జమలాపురపు దుర్గాంబ, రామ నరసింహారావు

దత్తత తల్లిదండ్రులు : అయ్యదేవర రంగనాయకమ్మ, లక్ష్మీ నరసింహారావు

విద్యాభ్యాసం : విజయవాడ: ఎస్.ఆర్.ఆర్ & సి.వి.ఆర్. కాలేజి.
హైదరాబాద్: ఎస్.వి.ఇ.ఎస్. కళాశాల, బి.ఎ.,

సాహితీస్ఫూర్తి : విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు

అభిమాన నటులు : సి.ఎస్.ఆర్. ఆంజనేయులు, బందా కనకలింగేశ్వరరావు

ఉద్యోగం : స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్

రచనలు : మరదలు, మాయని మమతలు, సుస్వరాలు, మర్యాద (ముద్రిత నవలలు)
యువభారతి కవితా సంకలనాలలో కవితలు
అముద్రితాలు : రాగాలపల్లకి, శ్రీకృష్ణదేవరాయ (నవలలు)

రంగస్థల జీవితం : దాదాపు అర్ధ శతాబ్దం, మూడు వేల ప్రదర్శనలు, శ్రీ కృష్ణునిగా వెయ్యి,
శ్రీకృష్ణదేవరాయలుగా 500 పైచిలుకు సార్లు

ధరించిన పాత్రలు : శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, వేంకటేశ్వరుడు, శ్రీకృష్ణదేవరాయలు, ప్రౌఢ దేవరాయలు, బిల్వమంగళుడు, హరిశ్చంద్రుడు, దుష్యంతుడు, రంగారాయుడు, వేంగళరాయుడు,రామదాసు, తుకారాం, రామప్ప పంతులు.

స్థాపించిన సంస్థలు : విజ్ఞాన దీపిక, శ్రీ సివిఎస్ఆర్ కళామందిరం, దివాకర్ల వేదిక

ఇతర సంస్థలలో యువభారతిలో సహకార్యదర్శి, ఉపాధ్యక్షుడు

బిరుదులు : నటసారథి, అభినవ కృష్ణ, మోహనవంశి,

సన్మానాలు : పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం ధర్మనిధి పురస్కారం, కిన్నెర వారి బందా పురస్కారం, యువకళావాహిని వారి రఘురామయ్య పురస్కారం. 1993లో తానా వారి ఆహ్వానంపై అమెరికాలో రెండు నెలలు అనేకచోట్ల భువనవిజయం ప్రదర్శించారు.

మా ఆత్మీయుడు శ్రీ అయ్యదేవర, శ్రావ్యమైన తన కంఠంతో అనేకమార్లు యువభారతి సమావేశాలకు ప్రార్థన చేసి అక్షయదేవతాశీస్సులను ప్రసరింపజేసిన అభిమానంతో, "అక్షతలు" ప్రచురణ సందర్భంగా...

**ఆచార్య వంగపల్లి విశ్వనాథం**

సమావేశ కర్త, యువభారతి.